# యోసేపు చరిత్ర.

హరికథారూపముగా

మహారాజరాజశ్రీ బీర్నీడి మోషేకవి గారిచే

రచియింపఁబడియె

ప్రచురణకర్త:— దర్శి బెంజమెన్ జోసెఫ్

ప్రొప్రయిటర్

ఆంధ్ర) విలేజ గాస్పెల్ బుక్కు అండ్ ట్రాక్టు డిపో

వించిపేట, బెజవాడ. (కృష్ణాజిల్లా)

# THE HISTORY OF JOSEPH

in the style of Harikatha

By

**Mr. BEERNIDI MOSES KAVI,**

**VINUKONDA.**

నాలుగవ కూర్పు 1000 ప్రతులు

తేది 15—7—1936

Annas 0--6--0 ] [వెల అణాలు 0—6—0

II

# మొదటికూర్పు అవతారిక.

నేని చిన్నగ్రంథమున కవతారిక వ్రాయ గ్రంథకర్తచే కోరబడినందున యిట్లు వ్రాయబూనితిని. భక్తవత్సలుండగు యోసేపునిచరిత్ర మనేకులు నాటకరీతిగా రచించిరిగాని అట్టి వేవియు అముద్రితము లైనందునను, "డా, మామాదిరి యోసేపుచరిత్ర లున్న యెడల మాకు పంపు" మని యెన్నో ఆర్డర్లు నాయొద్దకి వచ్చుచున్నందునను, సంగీతమందు ప్రీతిగల వారలకును, గ్రామస్థులైన సభలకిట్టిచరిత్రను హరికథమాదిరిగా
… గొప్ప కొఱతలను దీర్చునట్లు
…ఉదారబుద్ధి క్రీస్తుభక్తుల చరిత్రను
…గ్రంథము సూత్రదాయకముగా
…ము.

…ట్ల రచింపబడిన పద పద్యాం
…లభశైలిని బాడకట్టుచున్నందున
…తము దీనిసులభముగా గ్రహిం

…లబోలి హాస్యాస్పదముగా
… భక్తులమాదిరి ననుసరింప
…స్తవుల మేలునిమిత్తమును,
…గ్రంథము బహిరంగపరుప
…గాకయని వేడుచున్నాడను.

…ఇట్లు తమ శ్రేయోభిలాషి,

వేల్పుల జార్జి,
పాస్టరు.

# మొదటికూర్పు అవతారిక.

నేనీ చిన్నగ్రంథమునకు అవతారిక వ్రాయ గ్రంథకర్తచే
కోరబడినందున యిట్లు వ్రాయబూనితిని. భక్తవత్సలుండగు
యోసేపునిచరిత్ర మనేకులు నాటకరీతిగా రచించిరిగాని అట్టి
వేవియు అముద్రితములై యుండుటను, "డా॥ మామాదిరి
యోసేపుచరిత్ర లున్నయెడల మాకు పంపు" మని యెన్నో
ఆర్డర్లు నాయొద్దకి వచ్చుచున్నందునను, సంగీతమందు ప్రీతిగల
వారలకును, గ్రామస్థులైన సభ్యులకిట్టిచరిత్రను హరికథమాదిరిగా
గొప్ప కొఱతలను దీర్చువట్లు
ఉదారబుద్ధి క్రీస్తుభక్తుల చరిత్రను
గ్రంథము సూత్రదాయకముగా
ము.

ట్లు రచింపబడిన పద పద్యం
లభశైలిని బొడకట్టుచున్నందున
తము దీనిసులభముగా గ్రహిం

లబోలి హాస్యాస్పదముగా
భక్తులమాదిరి ననుసరింప
స్తవుల మేలునిమిత్తమును,
గ్రంథము బహిరంగపడప
గాకయని వేడుచున్నాడను.

ఇట్లు తమ శ్రేయోభిలాషి,
వేల్పుల జార్జి,
పాస్టరు.

# రెండవ కూర్పు.

మొదటి కూర్పున వేయించిన వేయిప్రతులను విక్రయింపబడి యిప్పటికి రెండేండ్లు కడచినను, దాని పునర్ముద్రణాకై నే నేకృషియుఁజేసి యుండనైతిని.

ఈచరిత్రమనేక స్థలములలో ప్రవీణులు సామాన్యులగు వారివలన తెలుగుదేశమువెల్లడల ప్రదర్శింపబడి నల్లుకొనియుండుటంజేసి, క్రైస్తవ సోదరులీ పుస్తకమును కోరుచున్నారనెడివార్త నాకెక్కువప్రోత్సాహమును కలిగించినది. అందుచే దీని పునర్ముద్రణము వేయింప రెవ. వి. జార్జిగారి కనుమతి యొసంగి రెండవ కూర్పునకు హక్కుదారునిగ జేసి యున్నాడను. క్రైస్తవోత్తములగు నా సోదరులెల్లరు దీని నాదరించి పఠించి యితరులకు వినజెప్పి క్రీస్తురాజ్య విస్తీర్ణమునకై తోడ్పడుదురనెడి యభిలాషగలవాడనై యున్నాను.

ఈ రెండవకూర్పునందు చరిత్రమందలి యేభాగమును తీసివేయకయు, చేర్చకయు, మొదటికూర్పునందలి యచ్చుతప్పులనుమాత్ర మొకింత సవరించితి. ఇంకను యచ్చుతప్పులు సిద్ధాంత, కవిత్వదోషము లుండకమానవు. అట్టివాని క్షమింప పాఠకుల విన్నవించుచున్నాడను.

వినుకొండ
1—1—23

ఇట్లు క్రీస్తునందు
మీసహదాసుడు
బీర్నీడి మోషేకవి
గ్రంథకర్త.

IV

# మూడవకూర్పు అవతారిక.



ఈచిన్నపొత్త మిదివరకు రెండుపర్యాయము లచ్చొత్తింపబడియె. మోసేపుచరిత్ర మందుండెడి మాధుర్యముచే ప్రతులన్నియు ఖర్చగుటవలన తిరిగి మూడవముద్రణ వేయించ బడియెను. ఈపర్యాయము ఇందుగల తప్పులన్నియు సవరించి అచ్చు పొరపాటులు లేకుండా కడుజాగ్రత్త తీసుకొని చక్కని కూర్పుగా ముద్రించి ప్రచురింపబడియెను. ఇందులకు తగు సహాయము చేసిన శ్రీ బాలసరస్వతీముద్రణాలయము వారికి మేమెంతయు కృతజ్ఞులము.

ఈ గ్రంథప్రచురణ హక్కును రెండవకూర్పునందే రెవ. వి. జార్జి పాస్టరుగారికి యిచ్చిన విధముననే తిరిగి యీ మూడవకూర్పుయొక్క ప్రచురణహక్కును గూడవారికే యిచ్చియుంటిని. జరిగిన రెండుకూర్పులను క్రైస్తవలోకమున పాఠకమహాశయు లెట్లు మన్నించియుంటిరో అట్లే తిరిగి యీమూడవకూర్పునందు గూడ దేవుని మహిమ వెల్లడించుచూ గ్రంథప్రాముఖ్యతను పాటించెదరని నావినయపూర్వకమైన వేడుకోలు.

వినుకొండ, 10—2—32

ఇట్లు, తమవిధేయుడు
దేవి.

V

# గ్రంథకర్తగారు వ్రాసియిచ్చిన కాపీరైటు అగ్రిమెంటు కాగితము.

ఆన 1936 సంవత్సరము మే నెల 27 వ తేదీని బెజవాడ గ్రామములో చేరిన వించిపేట కాపురస్థులు దర్శి యోసేపుగారి కుమార్డును, ది ఆంధ్ర విలేజి గాస్పెల్ బుక్కు అండ్ ట్రాక్టు డిపో ప్రొప్రయిటరునైయున్న దర్శి బెంజమెన్‌గార్కి బీర్నీడి మోషేకవి వ్రాసియిచ్చిన కాపీరైటు అగ్రిమెంటు.

నాచే హరికథారూపముగా వ్రాయబడిన యోసేపుచరిత్ర అనుపుస్తకమునకుగాను (రూ 50—0—0) అక్షరాల యాభై రూపాయలు తమదగ్గరనుండి నేను ఈదినముపుచ్చుకొన్నాను. గాన ఈపుస్తకము యొక్క కాపీరైటును స్థిరముగా (Permanent) మీకు అమ్మివేసి యున్నాను. గనుక యిక మీదట ఈపుస్తకమును ఎన్నిపర్యాయములైనను అచ్చువేయించుకొనుటకును ప్రచురించుకొనుటకును మరియు ఈ పుస్తకము యొక్క అమ్మకమునుండివచ్చు లాభమును అనుభవించుటకును మీరుగాని మీవారసులుగాని తరతరముల మట్టుకును హక్కుదారులైయున్నారని సంపూర్ణముగా ఒప్పుకొని దర్శి బెంజమెన్ గారైన మీకును మీవారసులకును సర్వాధికారమును నేనుయిచ్చియున్నాను. గాన ఈ తేది మొదలు యిక ఎన్నటికిని నేనుగాని నావారసులుగాని యిదునుగూర్చి యేవిధమగుతగాదచేయువారముకాము. మరియు మేమిక మీదట

ఎన్నటికైననుదీనిని ముద్రించువారముకాము, మరియితరమైనవారి కెవ్వరికైనను ముద్రించు యధికారము యిచ్చువారము కామని యిందుమూలముగా బప్పందపడి మీకు ఈకాపీరైటు యగ్రిమెంటు నాసమ్మతితో వ్రాసియిచ్చి యున్నాను.

(Sd) బీర్నీడి మోషేకవి వ్రాలు (వినుకొండ)
విప్పర్ల శివారు రెడ్డిపాలెం గ్రామము
నకెరకల్లు పోష్టు
నర్సరావుపేట తాలూకా
(గుంటూరుజిల్లా)

యిందుకు సాక్షులు.

1. వి. యం. యస్. ప్రకాశరావు వ్రాలు
2. వి. ప్రభుదాసు వ్రాలు
3. వర్ల వీరయ్య వ్రాలు

27—5—36



# నాలుగవకూర్పు అవతారిక.

నాయొక్క సంచారములలో నేనచ్చటికేగినను నాస్నేహితులు కొందరు బీక్నీడి మోషికవిగారు వ్రాసిన పుస్తకము లేవైనను హరికథారూపముగాయున్నను, డ్రామా మాదిరిగా యున్నను, మాకుపంపుమని అడుగుటవల్లనను, యుత్తరములు వ్రాయుటవల్లనను, వారియొక్క అవసరములను దీర్చునిమిత్తము తత్పుస్తకములు వారికిసప్లయి చేయవలయునని నాకెంతయో ఆశయుండినను అట్టిపుస్తకములు నాదగ్గరలేనందున సదరు పుస్తకములను నేను అచ్చువేయించి నాపుస్తకశాల తరపున విక్రయించవలయుననే కోరికగలవాడనై ఈగ్రంథముయొక్క కాపీరైటునా కమ్ముమనిమహారాజరాజశ్రీ బీక్నీడిమోషేకవి గ్రంథకర్తగారిని కోరగా దీనియొక్క ఖరీదెంతయో విలువైనప్పటికిన్ని అట్టి విలువనుతానుత్రోసి నాకనుకూలముగానున్నంతమట్టుకు ధరను తగ్గించి యాభైరూపాయలుమాత్రం పుచ్చుకొనుటద్వారా తాను హరికథారూపముగా వ్రాసిన మోసేపు చరిత్ర యను ఈపొత్తముయొక్క కాపీరైటును స్థిరముగా **(Permanent)** నాకమ్మినందుకుగాను నేనెంతయో సంతోషముతో గ్రంథకర్తగారికివందనస్తుడనై వారి మూడవకూర్పు పుస్తకములో ఉన్నది ఉన్నట్టుగా, నేనీనాలుగవ కూర్పును నాపుస్తక శాలనిమిత్తమచ్చొత్తించి, టైటిల్ పేజీలను మాత్రము నాస్వంతముగా వ్రాసి గ్రంథకర్త పేరు మాత్రం ప్రచురించితిని. మరియు పూలగంప, యిస్సాకువధ క్రీస్తుమతప్రభా, మోహానుచరిత్ర. శూరవిజయము, అను ఈ ఐదు

పుస్తకములయొక్క కాపీరైటును కూడ గ్రంథకర్తగారు పైవిధముననే పుస్తకము ఒకటింటికి యాభైరూపాయలు చొప్పున స్థిరముగా (Permanent) నాకమ్మియున్నగ్రంథకర్త గారికి మిక్కిలి వందనస్తుండనై వాటినికూడ అచ్చువేయు టకుగాను ముద్రణాలయమునకు యిచ్చియున్నాను. కావున పైవ్రాయబడిన ఈ ఆరు పుస్తకములు కావలయువారు తమ ఆర్డర్లను నాకు పంపుచు కృతార్థులు కాగలరని నేనునమ్ము చున్నాను. ఈ నాలుగవకూర్పు కూడ దేవుని మహిమను వెల్లడించునిమిత్తము మనపాఠకులందరు ప్రయత్నించెదరనియు, గతించిన మూడు కూర్పులవలెనే ఈ నాలుగవకూర్పుకూడ సన్మానించెద రనియు, కోరు చున్నాను. దేవుడు ఈకూర్పును ఆశీర్వదించి అభివృద్ధిపరచును గాకయని ప్రార్థించు మీస్నేహితుడు.

బెజవాడ
15—7—1936

దర్శి బెంజమెన్ జోసెఫ్
ప్రొప్రయిటర్ & పబ్లిషర్
ది. ఆంధ్ర విలేజి గాస్పెల్ బుక్కు అండ్ ట్రాక్టు డిపో
వించిపేట, బెజవాడ.



# జి. డి. మిషన్ హేండుబిల్సు.

1000. కి పెద్దవి రూ. 2-8-0 చిన్నవి రూ. 1-8-0 & 0-12-0

---

# పిల్లల పత్రిక.

సంపాదకుడు:— కే. జె. జి. సుందరముగారు
యిది మాసమునకు ఒకసారి ప్రచురింపబడును.
ఒక ప్రతి ఖరీదు మాసమునకు రు. 0—0—2 పైసలు
పోస్టు ఖర్చులు ప్రత్యేకము

---

పై రెంటిని కోరువారు ఈపుస్తక శాలకే ఈ క్రిందకనపర్చు విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవలెను

దర్శి బెంజమెన్ జోసెఫ
ప్రొప్రయిటర్ అండ్ పబ్లిషర్
ది ఆంధ్ర విలేజి గాస్పెల్ బుక్కు అండ్ ట్రాక్టు డిపో
వించిపేట, బెజవాడ. (కృష్ణాజిల్లా)

**DARSI BENJAMIN JOSEPH,**
Proprietor:—The A. V. G. Book & Tract Depot.
*Wynchipet BEZWADA.*
Kistna Dist (South India)

X

# దైవస్తుతి.

ఉ. నేనొక నత్తివాడనన ♦ నీకటఁదోడుగ నుండునంచు మో
షేనయి గుప్తకంప యట ♦ సేయఁడె? కార్యములెన్నొయట్లునీ
పైని భరంబు నిక్కముగను ♦ వ్రాసితి నేనుడికారముంటచే
గానయెహోవా! దీనినొగి ♦ గాంచవె? నీమహిమార్థమై భువిన్

ఉ. ఓపరమాత్మ! నీదగు మ ♦ హోన్నతశక్తి విశేషతం గదే
చేపలుఁబట్టువాడొకఁడుఁ ♦ జేసెను నాడుమహాప్రసంగభా
రాప్రతిభాషసన్వయము ♦ నోసటులట్టుల నస్మదీయ కా
వ్యాపణితిన్ వివరింపఁగగ్రా ♦ పానుమతిన్ రచియింపవేడెదన్

—♦♦ సుకవి విజ్ఞప్తి ♦♦—

ఉ. బుడతడుఁ దప్పుడప్పులను ♦ బోవఁ దటాలున నేలబడ్డఁజూ
చెడు జనముల్ బకాల్మనగఁ ♦ జింతిలఁడే? తేలవోయియట్లునే
నుడివిన గైతఁదప్పుల గ ♦ నుంగొని నవ్వ కికొక్కసారిమె
క్కు దుయతనంబుసేయుఁబుడి ♦ గొల్పగ వేడెదఁబండితార్యులన్

కం. ధరణి రసాలస్వాదన
మరయాజని మాన్నివాక ♦ సరతురె వారల్
జరిత రసంబును గనియెడు
సరసులుఁ గవిఁ దప్పులన్ వి ♦ చారింతురే? సూ.

—♦ కృతికర్త వంశము ♦—

కం. బీరినిడివారివంశము
ధారుణి సుబ్బయ్య మరియ ♦ తనయుండను నా
యూరన! వినుకొండయు నా
పేరా? మోషే యటంచు ♦ బిలిచెదరు జనుల్.




# యోసేపు చరిత్ర.

## హరికథారూపము

### ప్రథమ భాగము.



తో॥ క్షీర మధువులొల్కఁగ జగమున విల । సిల్లునట్టి కానా
న్నేరహోదైవపాదపద్మసేవ కా । నీక యొక్కటి యహీన
వైభవమున వృద్ధిజెందుచుండఁగ । వరలు నిశ్రాయేలు
లాభయుక్తి లేయరాహేలనుస్త్రీ । లంగొనియెనుమేలు.

వ. భక్తుడైన యాకోబునకు లేయవలన పదుగురు, రాహే
లువలన నిరువురకుమాళ్లఁగన, నందుఁజిన్నదానిపెద్దకుమారుఁడు
బుత్రదాద్వాదశిని యోసేపను వాడు సుందరాంగుఁడై జననీ
జనకులకు ముదమిచ్చుచున్న.

దరువు—హిం॥ తోడి—జల్వతా॥

వీని చక్కఁదనము నెంచైన మనముఁగనము- యీ-సూ
నుని విలతిలోన- వీనికి సరివానిగానము ॥వీని॥

1. యీ కనులీనడలు యాకరములీ చెక్కులు- లీకాంతులీ
సొగసు లీతని కేశెల్లు ॥వీని
2. తనువంతబంగ రన - దగునట్టిపాలుపారు నామనసువీనికొ
క్క- బహుమానమివ్వగను గోరు ॥వీని॥

వ. అని యూహించి యాకోబు చక్కని నిలువు టంగీని
కుట్టించి యోసేపునుఁ దనచెంగటికిఁ బిలిచి యొక్కనాడు

క॥ బంగారుచాయగల మే
నుంగల్గినయోసేపూ ! మనోహర ! నీవీ
యంగీనిధరింపఁగ నా
కుంగోరికయౌ, ధరించు కొనుమెది? చూతున్॥

వ. అని ధరింపఁగఁజేసి తండ్రి తనసుతులావణ్య విలాసంబు
లు బొగడుచున్న దక్కుకుమారులతనిపై యసూయబూని.

బ్యాండుస్వరము.

1. చూడఁబడతిమిగా?-తండ్రి - కసూయపరులుగా ॥చూడ
2. మనకంటెఁజక్కనివాడా? యితఁడు-మంచియంగీనిడ ॥చూ
3. యితనిపైనిసుమా! తండ్రికి - నెక్కువగుప్రేమ ॥చూడ

శా॥ ఏమీ వీడుకనిష్టుడై మనకు నె ♦ గ్గేచేయఁచున్నాడు, సో,
నీ! మర్యాదఁగనుంగొనంగనది లే ♦ నేలేను హా! వీనియఁ
గేమిన్నుందలఁజూపుచుండె మనమిం ♦ కేలన్ విచారింప
నెందేమర్దింతము, వీనిబట్టిమన క ♦ పేదీరనౌ గోరికల్

వ. యిట్లసూయం బూనియున్న సోదరుల తలిదండ్రుల సమ
క్షమున యోసేపు తా స్వప్నంబులం గని యొక్కనాడు.

బ్యాండు స్వరము—ఆదితాళము

1. వినుడి నాసోదరులార - చెప్పనుబోవు కలలూర।
2. మనము బొలమునను-బనలుఁగట్ట నా ♦ పనయులేచి -నిలు
చుండెవిూ - పనలు బాని మ్రొక్కుచుండె ॥వినుడి॥
3. అకట! యొకటసూర్యచంద్రులును పదు నొక చుక్కయు
నన్నుజుట్టె - నా - కొరగి దండములుఁబెట్టె ॥వినుడి॥

వ. అనిచెప్పిన కలలభావంబులు గ్రహించి సోదరులు.

కం. ఔరా! నీవుర! మమ్మే
లే రాజవు? నీను సేవ ♦ వృత్తులమనమే
మేరా? మముదూర సహం
కారం బేరిచ్చి పంప ♦ గ్రాలెదవిటరా?

వ. వెండియు తండ్రి యిట్లనియె.

దరువు హిం—తో—ఆదితాళము

ఈకలలఁజెప్పకుమయ్యా-ఓ-నా కుమరమేము వినంగదయ్యా

1. రవియునఁగ నీతండ్రి - రజనకరుఁడనఁ దల్లి - యవనిలో
నిను మ్రొక్క నేర యది తక్క ॥ఈకలల॥

2. వీరలవెనుఁబుట్టి - మొంగిలిచనుముఁట్టి - తేరీతి నినుఁజుట్టి
యెరగుదురు, రా! పట్టి ॥యీ॥

3. మంచివాఁడను చెల్ల-మనుజులునినుబిల్వ- సంచరించు- మెల్ల
సమయములు రాజిల్ల ॥ఈకల॥

వ. అని తండ్రి కుమారున కిట్టినీతులుఁజెప్పె నట్టిసమయమున
మందలను మేపుటకై షెకెమునకుతోలుకొనిపోవ యింట
నున్న యోసేపును డాయంబిలిచి దండ్రి

తో॥ తనయ! నీకుఁజెప్పినట్లు నీవతి ♦ త్వరను షెకేముసకున్।
జనియన్నలనుగని జాడవిని ♦ చనుదెంతువే? యిటకున్
మందలెట్లు వృద్ధిజెందుచున్నవో ♦ మరలితెమ్ము జాడన్
బొందబోకుభీతి నేనువత్తు నె ♦ బ్రోనుకునీతోడన్॥

వ. అందులకు సమ్మతించి, సోదరులకునై భత్యము సిద్ధము
చేసుకొని ప్రయాణమై నడచినడచి, తుదకొక్క మేర
సోదరుల డాయవచ్చువానిజూచి యోసేపనిగుర్తించి.

మ. అదుగో వచ్చుచునున్న వాడురా! వహ ♦ వ్వా వానినీ చేమించియి
క్కడఁజూపింతము నాటిస్వప్నముల హుం♦కారంబు, బీరంబునుం
దుడుకుల్ జెప్పియు దండ్రికిన్ మనకు బాం♦ధున్ వీడ నా కార్చెని
చ్చెడుగుం దీఁజెచి పూన్చి వేయుదమిటన్♦ జి త్తంబులో ప్పారగన్॥

వ. అటుసేయఁ దలిదండ్రులడగిన నటవిమృగంబు చంపెనని
యొక్కమ్మడి వచింతుమను వారితో పెద్దవాఁడైన రూబేను

హిం॥ తో॥ జుల్వ.

శాంతించరే యింతపంతమదేలను సొంత తమ్ముఁడుగాడా?
కొంతక్షమింపుడా? ॥శాంతించరే।

1. క్షేమసమాచార మేమొఁ దెల్పఁగోరి ప్రేమతోనరగువాని
నేమని జంపెదము॥ శాంతించరే॥

2. తల్లిదండ్రులింటఁ దగువార్తలంపిరేమో నల్లిబిల్లిగా వాని
నాలకించెదము ॥శాంతించరే॥

గీ. గాన నవ్వాని జంపు టు ♦ క్తంబుఁగాదు
మనుజుఁ జంపినవారు పీ ♦ రనెడు వాదు
లోకమెల్లడ వ్యాపించు ♦ శోకతప్తు
లగుట నిక్కము తలిదండ్రు ♦ లకట! తగునె॥

వ. అని వాదము లాడుకొనుచున్న సమయముననె యోసేపు
వారిని డాసి.

జంఝూటి—ఆది.

యో. అన్నలారా మీ-రందరు క్షేమమే? షన్నగజీవజాలములు
కుశలమే యన్ని దెలియ నన్నుబంపె జనకుం।డన్నలారా
అన్నలు రాయభారివా న్యాయాధికారివా? హేయవృత్తి మము

నెంచినట్టి నినుగో యిలోన ద్రోయక - విడుతుమె ॥మా॥
యో॥మిమ్మేమిచేసితి-సామ్మేమిదోచితి-నమ్మితి నాయన్నలంచు
మిమ్మునను-దొమ్మిఁజేసి నను ద్రోయ దలంతురే? ॥అ॥
అ॥ విడువిడువిడువురా-యొడలిపైనంగీరా - కడిగిదీనిజీల్చి వేయు
కను నీగర్వమింత నంతమగురా ॥రా॥
యో॥సొంతవాడనే మీకింతమూఢమే - కాంతారంబున నింత
వంతమీ చెంతకుఁ బిల్చి యిట్లుచేయున్యాయమే? ॥అ॥
అ॥ విలపించు టేల్రా- అలనాఁడుగన్న రాకలలునింతపనిగావించె
నురా - తలచుకొమ్మునాటి కలల ఫలమిది ॥రా॥
వ॥ యిట్టిపౌరుషవాక్కులనాడియతనిపైయంగీనిదీసి గోతినిబడ
ద్రోయఁ గొంపోవునపుడు నారికతినగుణంబు లెట్టిదనిన॥
సీ. కటకటా:— గొర్రె యే ♦ డ్పుటఁగని కటికి తా
గొంతుపై కత్తిడి ♦ కోయకున్నె?
అటవిమధ్యనుజిక్కి ♦ యల్లాడినంగాని
దొంగ చూచియు వాని ♦ దోచకున్నె?
మూషకం బరుమురి ♦ ముద్దుఁజూపినను మా
ర్జాలంబు దానిని ♦ జంపకున్నె?
మెల్లమెల్లదిరుగాడు ♦ మేకగున్ననుగని
వృకము పైఁబడి దాని ♦ బీకకున్నె?
గీ॥ యిట్టిగుణములు మీలోన ♦ బుట్టునప్పు
డెట్టి యన్నలు మీరు మీ ♦ కెట్టితమ్మ
డహహా! మీదుర్గుణములు బా ♦ హ్యంబు లయ్యె
నితవుఁ దప్పిన కాలమం ♦ దెవరికెవరు?

వ. ఎట్టకేలకు యోసేపును బలత్కారమున బడఁద్రోసిరి. అటభగవద్ధ్యానపరాయణుండై

బేహాగ్—జుల్వ.

పరాత్పరా! నన్నుబ్రోవ - నాపాల నీవు లేవ ?
చరాచరాత్మకా! దేవ - సన్నుతింతురావ? ॥ప॥

1. కనుమూయనివాడా! నన్ - గానవా నీ వీడ
ఘనపాశంబులతోడఁ - గట్టిత్రోసిరీడ ॥ప॥

2. ఏడ నుండవేమి - నీతోడుఁ గల్గెనేని
పాడైన గోతిచూడ - గా - బంగారుమేడ॥ప॥

3. అన్నలనుక్షమింపు - నా - కాదరణబంపు
మున్ను శ్రమలడంపు - నాకున్న దాతలంపు ॥పరా॥

సీ. దైవమా! నాదు ప్రా ♦ ర్థన సార్థకంబైన
నే గోరుసాహాయ్య ♦ మీగదయ్య
యేకాకినైగోతి ♦ వాకొనఁచుండ న
న్నారడింపంగ న ♦ ర్హుండవయ్య
క్రూరులచే బల ♦ త్కార మిందుం ద్రోయ
బడిన గాయములు మా ♦ న్పంగదయ్య
దూరమా! నంజేర ♦ భారమా! నాకరం
బంది లేపుమిదే నె ♦ య్యంబునయ్య

తే. మున్ను యాపన్నులను బ్రోచు ♦ సన్న నీదు
బిరుదు శాశించుటకునిదె ♦ తరుణమయ్య
క్షితిని నేను నిన్నాశ్రయిం ♦ చితిం గదయ్య
యాపదల్బాప నేశర ♦ ణంటి నయ్య

వ. ఇట్లు వెక్కి వెక్కి గోతిలోయేడ్చుచుండె. నింతలో నిష్మా యేలీయు లటవచ్చుచుండుటం గాంచి గోతినుండియతనిం దీసి

శంకరాభరణము—ఆది.

రానియ్యుడు యీరమణుని - పూసి వారికిన మ్మెదను కాని వానిని మనమిూ - కొనసమంపు - జంపన్యాయమె? ॥రా॥

1. బాలుడు మనరక్తసంబంధ మొంది యుండలేదె-యీలేని పోనిగోల-లేల ? బిరాన నేవెల కవలీల ॥రాని॥

2. తల్లులువేరై-తండ్రి వేరై పోయెనె? పిల్లవాడిం దల్లాడమన ముల్లముల౦ను సంతసింప నేయమె? ॥రాని॥

వ. అనియూదాతదితరులకు జెప్పి సమ్మతింపజేసి వచ్చు బాట సారుల కడ్డమై నిలువంబడి మోసేపుం జూపుచు,

ఉ. చూపునకందగాడయిన ♦ చోమరియేమిఫలంబు? యెప్పుడున్
మాపయిపాదెగాడుయువ ♦ మానముజేసిహసించువాడుయే
మోపసివాడు లేయనుచు ♦ నూరకె యుంటిమి కోపమెంతదా
కాపంగలామువిూకునిప్పు ♦ డమ్మెద మెంతక్రయంబునిచ్చినన్

వ. అద్దేమందు రేని.

తే. కంటనలుసున్న చందమై ♦ క్రాలినప్పు
డితనికిన్ మాకు సంబంధ ♦ మెట్లుగలుగు
వేయి మాటలికేల? రూ ♦ పాయలిచ్చి
యితని గొంపొండు మమ్మాటి ♦ కేనిజంబు.

వ. యిట్టి యూహాలు వెల్లడించుచు యెట్టకేలకు నతని యిష్మ యేలీయులకు కమ్ముచున్నపుడు.

కాంభోజి—రూపకము

ఇంతమోసముఁ జేయమీతో-నేమనందురా- యీదినమున
సొంతవాడనంచునాపైఁ - జింతనరవ్వంతయుమీ - చిత్తం
బులఁ దగులదు నే ॥ఇంత॥

1. కన్నతల్లికెకన్నప్రేమ-కడమవారికి- కాలముగతిమిన్నునున్న
వాడెన్నడైన - మన్ననపైమిన్ననా - కెన్నడుయాపత్తు
లనే ॥ఇంత॥

2. తమ్ముఁడంచును దలపులేక-ధనముఁగొ టిరా -తామసముఁన
సొమ్మా? జీవనమ్ములమీకు- గమ్మనివస్త్రమ్ములమహి కల
కాలము బ్రతుకనైన ॥ఇంత॥

3. చివరిమాటలుఁజెప్పెదను చెవులనింపుడు శ్రీకరము గనవి
నయంబుగ నన్ను బెంచిన-జనకుండడిగిన నావిస్తరమేమని
నుడుతురచ్చ ॥ఇంత॥

వ. నాకు నేనే దేవునకు యాగమైతిని గాన

సీ. నరరూపమున వసు ♦ ధరఁ బుట్టితినిగాని
నిజముగా భువి నాకు ♦ నెలవుఁగాదు
తల్లిదండ్రులకు ను ♦ ద్భవము నొ దితిగాని
నిజముగా వారి కా ♦ త్మజుఁడఁగాను
మీకుఁ దోడైనేను ♦ మెయిఁదాల్చితినిగాని
యరయఁగ మీకు సో ♦ దరుఁడఁగాను
మూన్నాళ్ళ బ్రతుకుకై ♦ మురయుచుంటయుగాని
కలకాలముండుఁ భా ♦ గ్యంబు గాదు

తే. నిజముగాజూడమోక్షమే ♦ నెలవు నాకు

దైవమే నిక్కముగఁ దలి ♦ దండ్రినాకు
బరమదూతలు నిజము సో ♦ దరులు నాకు
బరమపురినుండు నిత్య ♦ జీవమ్మునాకు

వ. యిట్టి సద్బోధలాలింపక,నిర్దయులై యోసేపుతో నీవిపుడు జనునది పరదేశముగాన మాలోనటించినట్లు నటించక జాగ్రత్తగా నుండుమను సోదరులతో

ఉ॥ కొదవది లేదుపొందుఁననుగొట్టుదురెవ్వరు♦ నోటనాల్కమం చిదియగునేనినాకుఁ బరసీమయె ♦ స్వీయపురంబుబుద్ధిమం చిదియగునేనిపూరుషులు ♦ స్త్రీలును బ్రేమపుదల్లిదండ్రుల య్యెదరుకదన్నలార!జగ ♦ మెల్లడమీవలె నందరుండురా!

* అని సోదరుల సెలవు పొంది యోసేపు సాగిపోవుట *

వ. రూబేను తిరిగివచ్చి సోదరుని గోతవేసితిమిగదా ? అత డెక్కడ.

హిం-తో—ఆది

అయ్యయ్యో? యోద్రోహులారా యనుజుఁడిందు లేడేమె య్యెడ దాచితిరో జాడేమి చెప్పరదేమి ॥అ॥

1 ఆరమణీయుండు లేకీ-యంబరంబు లేలరా! ధారుణి జీవం బదేల? తనువది వాకేలరా! ॥అ॥

2. తమ్ముఁడు మనకేమిహానిఁ- దలచె నేమైనెంచురా - కమ్మి మీరలంత వానిగష్ట - పెట్టఁదగునురా ॥అ॥

వ. అనిన దమ్ములన్నా! ఏలవిచారపడెదవు? అతనిగొంతవెల కమ్మితిమి, మీరిన దానికి చింతిలుట న్యాయమే? అనిన రూబేను

సీ. కీడో! మేలో! నేను ♦ జూడకుండిన నాదు
యనుజుపై దుఃఖ మె ♦ ట్లాపవలయుఁ
గొడుకున కెదురు చూ ♦ డ్కులఁ నిగిడ్చెడు జన
కున కేమనంచు వా ♦ క్రువ్వవలయు
నన్ను రేడని జవా ♦ బడిగిన బెన్యమీ
నున కేమనంచు నె ♦ నుడువ వలయుఁ
దల్లిలేనిబిడ్డ నెం ♦ త పనిచేసితిరను
యిల నోళ్ళనెట్లుమూ ♦ యింపవలయు
తే. నింద రిట్టులఁ జింతింపఁ ♦ నెసరుఁబోసి
యనుఁగుదమ్ముని బరుల క ♦ ట్లమ్మివేసి
కడకు మీర లేమియు మాటఁ ♦ గట్టుకొంద్రు?
గుండెగలవారలార పా ♦ పండులార॥

వ. అందులకు వారు

బేహగ్—జుల్వ

ఆ చిన్నవానినమ్మ-గాఁజూచె నెవ్వడు - చూచిచెప్ప నేమి
యది సూచించు నెవ్వడు ॥అ॥

1 చేయనేర్చినట్టివాడుఁ - జెప్ప నేర్వకుండడు-ఆయయ్యను మె
ప్పించని యధముం డిం దెవ్వడు ॥అ॥

2 నీవలె నూరకకంటి నీరువిడచు నెవ్వడు! - గావమేము నీ
కుండగను జంపు నెవడు ॥అ॥

వ. మరియు తమ్ములవ్నా! తల్లిదండ్రులు నమ్మనటొక్క ప
న్నకముఁ బన్నెదము. మేకను గోసి దాని రక్తములో
నీయంగీని ముంచి, యోసేపు నడవిలో మృగంబు తినిమె

ననినమ్మిక పుట్టునట్లుఁ జెప్పగలవారము మేము, దీనికై కుందనక్కరలేదని యట్లుగావించుకొని, వచ్చిన కుమారులఁ దండ్రిచూచి

తే. అన్ని మంచులు సుఖముతో ♦ నున్నవయ్య
మీరు క్షేమముతోడ ను ♦ న్నారటయ్య
కారకాడేమి? నాదు బం ♦ గారు కొండ
వెనుకనున్నాడె? చెప్పుడు ♦ వెరవకుండ

వ. అందులకు వారు

హిం. తో—ఆది.

వినుమిది నీ వేమరక నాయనా? వినుమిది నీవేమరక॥
మనమునకును చింత-తన మొనగూడునునీ - తనయుఁడగు యోసేపునకుఁ గల్గినచావు ॥విను।
కాననమందు మృగంబు నఖంబుల-మేనువిదల్చియు-గ్రమింగెనట వానిని ॥విను॥

వ. హా! యని గొంతవలకు కిచ్చవడఁజూచి యాకోబు

సి. హా! యోసేపూ! మనో ♦ హర! వంశదీప! ని
న్నెంటిగా నేల పో ♦ మ్మంటినయ్య
బంగారుచాయ మే ♦ నింగాంచియైన యా
మృగి విడలేక పో ♦ మొగదయ్య
కటకటా! నిన్నుఁజం ♦ పుట కా మృగంబు నా
చేతులార నిను దో ♦ సితి, గదయ్య
యోసేపయంచు నే ♦ నూహించి యేరిఁ బి
ల్వఁగ నేర్తునాకుఁ జె ♦ ప్పవుకదయ్య

తే. క్రూరమైనట్టి మృగినోట ♦ గూలినిమిష
మాత్ర కాలంబులో నీవు ♦ మడిసితయ్య
దుఃఖ మను కూ్రిరమృగినోట ♦ ద్రోసిమమ్ము
బ్రతిదినంబును హింసింపఁ ♦ బాడియయ్య?

బేహగ్—ఆట

హా! యోసేపు! - హానాకుమారా! హా యడవివాలైతి
వటరా ॥హా॥

1. చక్కనయ్యవంచురంగు - చొక్కా తొడిగిచూచితిరా
మక్కువెల్ల మన్నుఁ జెల్లమాయమై పోయితివటరా ॥హా॥
2. అడవికి నిన్నేలబొమ్మ - నంటినో నాప్రియకుమారా -
కడకు మరణమనెడుమృగము-కంటబడిపోయితివటరా ॥హా॥

వ. ఇట్లు పెద్దపెట్టున యేడ్చుచున్న తండ్రిం జేరంజని

తొ॥ పోయినట్టివాని నేల దలచిటు ♦ పొరలి యేడ్వనగునా
ఆనుమానమూకుఁడుఁబోయినట్టి తెర ♦ వందరికగునాయనా
నీకు మేముఁ జెప్పునంత వారమె? ♦ నీవెరుఁగవే? దీని
వాకొనినంతమాత్రమతడు ♦ వచ్చునె? నీసన్నిధిని॥

వ. యిట్టి తత్వసిద్ధాంతమగు నీతు లెన్నియో వల్లించుకుమా
ళ్ళుఁగని.

మ॥ గంపెడుమంది పిల్లలను ♦ గన్ననుద్రృప్తిని, మిత్తివాతకున్
దెంపువహించియొక్కరుని ♦ తీవ్రతఁద్రోతురె? త్రోతు రేని
చింతింపనివారలుంగలరె♦తీయని మాటలుఁబల్కన్నెమి, ర
త్నంపుతురాయి యోసె పోక ♦నాటికుమారుడె? యూర
డిల్లనెన్॥

వ. అని మరియు యీమరణమునకు

తే. అద్దముద్దును మొగమాట ♦ మైనఁగలదె?
ముసరులేశోక కంటెనె ♦ పోల్చిచూచి
నోటఁగుక్కు మృత్యువుకేరు ♦ చాటువారు
గ్రద్దరీతిగ పైనెప్డు ♦ గాచియుండు॥

వ. యాకోబు మరింతవిచారముతో

సీ॥ కనులార! పుత్రుఁ జ ♦ క్కదనంబీక్షింతు
రేరిపై నికదృష్టి ♦ చేరుమీకు
చెవులార! నా తనూ ♦ భవు మృదుపల్కులా
లింతురిం కేమి యా ♦ లించువారు
హృదయమా! కొమరుపై ♦ నీదయవీక్షింతు విం
కేరిపై నెనరూన ♦ గోరెదీవు
తనయులారా! యీర్ష్య ♦ తమ్ముపైనింతు రిం
కేరిపై నీర్ష్య ర ♦ చింతుకీరు
తే॥ విమలజ్ఞాన పరతత్వ ♦ వేదిసకల
సుగుణ గణశాల పుణ్య సం ♦ శ్లోకుఁడగుచు
సిరులుఁజెన్నారు ముద్దుయో ♦ సేపులారా
భాగ్యమదియేల నీమొండి ♦ ప్రాణమేల.

వ. ఇట్లు యాకోబు నిరంతరము దుఃఖించుచుండెనట నిష్మాయేలీయులు యోసేపును గొనిపోవుచు నడువఁజాలకతో ట్రుపాటున నేడ్చుచు నడుగులిడుచున్న వానితో యిష్మాయేలీయులకిట్లు సంభాషణముగల్గె.

బేహాగ్—ఆదితాళము.

యిహ్మా॥ హా సుకుమార! హా గుణపూర - వేసారి నీవిటు విలపించు టేలరా? ॥హా॥

1. అమ్మినవారలు-నీ - కన్నులుగారా! - నెమ్మిటసుంతయు నిల్వర దేమిరా ॥హా॥

2. ఓమిత్రులారా - యుపకారులారా - మామకసోదరుల్ మీరుమాత్రము గారా ॥ఓ॥

3. అన్నలె, వార-లైనమరేమి యెన్నియొకీడు-లిల జేసినారు!

వ. అట్లు యోసేపు చెప్పినవిని సరేసీవేమిప్పుడుగొసర్పువాడవు? కాని త్వరగాసాగి పోదమడుగెత్తి నడుమను యిష్మాయేలీయులతో

ఉ. ఈగహనప్రదేశముల ♦ నెన్నడు నేగమనించియుంటి నయ్యా!గడుసైనరాలుఁజివు♦రాకులఁబోలుఁబదంబులంటియుం తేఁగసిగండె, సుంతయున ♦ ద్రిమ్మరుశక్తి యొకింతలేదు స న్నీగతి కప్పగించిరికు ♦ వృత్తిసహోదరులన్ దలంచెదన్

వ. యిట్లు యోసేపుచెప్పుచు తుదకయిగుప్తు జేరినమీద తత్పురిని వీధులవెంటఁ ద్రిప్పుచు యిష్మాయేలీయులు.

బ్యాండుఃస్వరము.

వీనిగొనరే మైగుప్తుపీటివాసులారా- మానుగవీనియన్నలు మాకమ్మినారురా ॥వీ॥

1 సుగుణాలవాలుఁడు - సుందరకారుఁడుఁ - బగవానికైన వీడు- బాంధవుఁడు కాఁగలడు ॥వీ॥

2 యొకచెంప రుధిరమును మ - రొకచెంపబాలుగారు - సుకు

మున జెరిగినట్టుల - సూచించు నీ- సౌరు ॥వి॥

వ. పోతీఫరుండతనిగొన్న నిష్మాయేలీయులరగిరి. అటపోతీ
ఫరుండు యోసేప్పు నీవృత్తాంతమేమియన

తో॥ యాలకించుమేను వచ్చిన వృ ♦ త్తాంత మెల్లసామి
తాలిమింత లేకయున్నలుంబగఁ ♦ దలంచి చంపలేమి
సుంతలాభమున వీరికమ్మఁ బ్ర ♦ స్తుతంబునవీరు
కొంతలాభముందుఁ జూచుకొనిమీ ♦ కునమ్మిరి జోహారు॥

వ. విని పోతీఫరుడు సంతసంబున నతనితో

శా. నీలావణ్యవిలాస సంపదకడున్ ♦ నీమోము వాంఛింపఙ్ఞా
నాలాపంబునకుంగొఱంతయె? భవ♦ ద్వ్యాత్రక విమర్శింపనా
కేలా? మామకరమ్య హర్మ్యతలమం ♦ దేవాసివైస్వాంతక
ల్లోలంబుల్ దిగనాడుమింక నెర్రిశ్రీ ♦ లుంజేరమద్గేహమున్

వ. ఇట్లు జెప్పి తాఁ బెంచుకొనదలంచి తనయింటికి గొనివచ్చి
తనభార్యకు యోసేపుని జూపుచు

పార్శీమట్టు

తరుణీమణిరో! యీ ♦ తనిజూచినావె- మురిపములమూట
గీ - మునకు నడిచెఁ జూవె ॥త॥
పెరవానిగజూచి - పెంచకుమువీని - సరియైనవేళల భో-
జన మిడవె పూని ॥త॥

2 తలిచాటువాడనుచుఁ - దనువొప్పుచుండె - భళిభళిరె
మననోము - పంటయిదె పండెఁ ॥దరు॥

వ. జెప్పిన లలనామణి సంతసిల్లి
తే. పాత్రలో క్షీరనీర ♦ బంధమట్లు

అగ్రముమున కంటుమావి కొ ♦ మ్మంటురీతి
నెరుసాకింతయులేక చ ♦ రించుసేని
ద్రోసినను బోని నూత్న బం ♦ ధువుడుగాడె.

వ. మగనికి నచ్చునట్లు జెప్పి మోసేపు నింటఁజేర్చి వేళల కిష్టమృష్టాన్నములం దృప్తిఁజేయుచు సన్యభూషణాంబర ధారుని జేయుచు, నత్యంత సంతోషమ్ముల్ల బోషించుచుండ దన్ను దల్లిగాభావించుకొనుచుండె. అంతసుఖభోజనంబుల నీడలను బెరుగుటంజేసి శరీరంబున మిసమిసల్ గాంతియంకురించె నప్పటినుండి యాకాంతామణి మోసేపుపై మనసు పట్టంజాలక దినదినంబు తనమనన్నున

హిం. తో — బాలాజిమట్టు

అతనివన్నెల నెంచతరమా-నాగతిని విచారింప గల్గెనో లేడో - ॥య॥నా - మదినిజెరచుచున్నాఁడు - చందమామకు సరివాడు - రాజతతికినినిమించినాడు - నామతిదెల్పి చూచిన - మాల్లాడు నేమొ ॥యతని॥

1 నిగనిగలమెరుఁగారు - నిలువెల్లబంగారు - లే-నగవెపుడు నుండితీరు - మందగజమువలె నడువగోరు - మోవిగదలిన దేనెకారు - నాతగులంటి ముద్దాడు - తరణమేదైనతీరు ॥న॥

2 ఫలకములు సరిబోలు - ఢళుకు బెళుకుటద్దాలు-పలుచాలు లౌను ముత్యాలు. దెలుపులె వానినేత్రాలు - నొక పలుకేచేయు వేయివరాలు - యీచెలికానితోఁ బొందుఁజేసినంతెచాలు ॥నత॥

న, ఇట్లు వర్ణించుచున్న మోహాంబధికమై యొంటిపాటు నింట

నున్న నొక్కనాడు యోసేపుని బట్టుకొని

ఉ. వచ్చినదాటనుండి యొక ♦ నైఖరిగా నిను సాకుచుంటనా
యిచ్చనుదీర్చఁగా దెకిమది ♦ నెంచితిఁబెక్కుదినాలనుండిరా
వచ్చును నేటికైన మది ♦ వాటిలు మోహమడంపజాలనీ
పచ్చనిపూలపాన్పుపయి ♦ భావజునిందెగటార్పుమోసఖా॥

వ. అంచులకు యోసేపు అమ్మా

ఆరభి.—ఆదితాళము

పరువా! యిట్లాడనాతోడఁ - బాపముకూడా ॥పరు॥
సరిమె! దేవుని ప్రచారమైనసం-స్మరణభక్తిఁ జెడువాడపర
మాత్మ్మఁడిప్పుపై లేడా? చూడరాడా- పెరగిపైని పై నిరాకు
తల్లి ॥పరువా॥

సీ॥ మనుచుండినట్టి ♦ జన్మస్థానముంబాసి
నను? యిద్దియేస్వీయ ♦ మనితలంతుఁ
మునుపేను యనుభవిం ♦ చిన బెట్టిదము లకీ
యఖిలనితాంత సౌ ♦ ఖ్యమని తలతు
దిక్కెవ్వరనిపరా ♦ ధీనుండనైయేడ్చి
ననుప్రభుండాదరిం ♦ చునని తలతుఁ
గడుగండ్లుఁ బాపించి ♦ కన్నతల్లినిబాసి
నను బెంచుతల్లి ♦ వీవని తలంతు

తే. నిన్ని తలపులలోన నూ ♦ హించునట్టి
నామనోసాక్షికిన్ ద్రోల ♦ నడువఁజాల
బ్రాణమైన నొసగెద నీ ♦ పాపమునకు
బెనుఁగులాడక విడువు నన్ ♦ బెంచుతల్లి

వ. అని యోసేపుబలాత్కారమున పైరుమాలునామెపైఁ బార వైచి బైటికి పారిపోయె నింతలో నది యింటివారినందరిని బిలిచి యోసేపు తన్నుబట్టి అరడి చేసినాడనియు . నందుకు నీరుమాలయే సాక్ష్యమనియు జూపి డగ్గుగుత్తికతోఁ జెప్పు చుండ నింతలో తనభర్తవచ్చి

కళ్యాణిరాగము—ఆదితాళము.

కాంతరో! యేమిటగల్గెను! కుందగ గారణమేమొ తెల్పవే నాతోడ॥

1 నగలుధరింపవు- సొగసనగాంచవు- పొగలుటదేమి తెల్పవే నాతోడ॥

2 ఎవ్వరుకొట్టిరె యెవ్వరుతిట్టిరి జవ్వని తెల్పఁగదే- ॥ నాతోడ॥

వ. అనిన యా వగలాడి, యా కొంపలగుత్త

తోడి—ఆట.

ప్రాణనాథ! యీసంగతిఁ-బల్కను నాకుసిగ్గతి- మానహాని కూడు క్షితి-మందలింపను నా మతి ॥ప్రా॥

1 యేమని చెప్పుదాన యోసేపు డీ దినమున - కాముకేళికి రమ్మన గష్టపెట్టెనే గాదన ॥ప్రా॥

2 యింటఁదెచ్చినాయ్యనితని గుణమెరుఁగవు - కంటకుని దెచ్చి నీవు గావించితివె? యీచావు ॥ప్రా॥

వ. అంతుల కతంపు అశే! యిదేమి చిత్ర మతం డంతటి పనికి వచ్చెనటేయని వాదించినమీద యది పసివా డనియా నీ యూహ

మ॥ అననోరాడదుకాని నిన్ను, పసివాఁడా? వాడుజూడంగఁగ

ద్భువగతుల్ గల శూరుడెట్లనిన ని ♦ ష్ఫుంబోవగా జూచిమం
తనమున్ బయ్యెదఁబట్టిలాగిమరుబా ♦ధన్ బాపుమాయంచునన్
బెనగన్ ఛీ! యిది నీతికాదన జనెన్ ♦ జేసేత జంఘాలుడై

వ. అని కల్పించి చెప్పినమీద యోసేపునిపై యాగ్రహించి యొకభటునిచే, బలిపించి

హిందూస్థాని—పాట

ఛీ! ఛీ! నీవీదినము - జేసితివిరపాపము-యీ చాతుర్యంబిట
యెవరుచెప్పె రోరి జూట ॥ఛీ॥

1 యిట్టివాడవనుచుఁ గా- ల్మెట్టినపుడె నేవినర - పట్టివగుదు
వనుచునుజే-పట్టిన ఫలమిదుదేరా! ॥ఛీ॥

2 నీచేతకు దగినట్టి- నెలవిపుకతఁడుజూపుర-వేచనుమిట నిల్వ
కవివేకి పలుగాకి ॥ఛీ॥

మరియు

ఉ. నీతలిమాన్కి—నామతరు♦ణిన్ గనుదంచును నమ్మినట్టి న
న్నా! తలవంపుసేయనుబ్ర ♦ యత్నముజేయదలంచుటీవు ఛీ
ఛీ! తలకెక్కె—రా! పొగరు♦చిన్నగనీమును జేరి యేమ మే
నైతివి కేమిచేతు దులు ♦ వాచెఱనుండు మదాజ్ఞ పెంపునన్

వ. అని చెఱసాలనుంచ నాజ్ఞ నియ్యగా యోసేపు

తే. చెఱను వసియింపుమంచుఁ బం ♦ చినమ రేమి
యాత్మఁ జలితంబుఁగాక నే ♦ నడతు నేని
తరువుఁబాయని నీడచం ♦ దమున విడక
కాచు దైవంబు నాకుఁగ ♦ ల్గగ భయంబె?

వ. ఇట్లు నిర్ణయించుకొని యున్న యోసేపు చెరసాలలో బంధింపబడియె నట.

ముఖారి—ఆది తా॥

శ్రీయెహోవా! నిన్నెనమ్మితి క్షితిలో - నీవెనాగతి ॥శ్రీ॥
మాయజగంబున హాయిలేదెన్నడైన - కాయుచునీవుండిన
కటకటా! యిడుములాయె ॥శ్రీ॥

1 పుట్టినతోడనె గిట్టకపోతిని - బెట్టిదములనుభవింప-పుట్టించి
తివ యీజగమున ॥శ్రీ॥

వ. ఇట్లు భగవధ్యానపరాయణుండైన యోసేపు భక్తివైరా
గ్య ములంగాంచి యాచెరసాల నాయకుండు.

శా. ఓరూపోన్నత!భక్తవర్య సుగుణో♦ద్యుక్తా! దురూహాంబునే
నేరంబెన్నియమాత్యుఁడిందునిచెపో ♦ నీ దైవమేచూచు న
య్యోరానున్నదిరాకమున్నెయిదెనా♦యుద్యోగముం జేరుమీ
జారాచోరగృహాంతరోదిత మన♦స్తాపంబులన్ వీడియుర్.

వ. అనియోసేపుని తనయుద్యోగమందుంచె, తత్కారాగృహ
నాయకత్వము వహించియుండ నొక్కనాడు, పానదాయ
కుండను వాడు భక్ష్యకారుఁడనువాడు స్వప్నంబులంగని
విచారపడుట యతండుఁజూచి పానదాయకునితో.

తో॥ చెలుఁడ! నీమదిలో యోచన ♦ చేయుచున్న వేమి
కలమొగమున నేమియులేకను ♦ గమలుచుంటివేమి?

పాన॥ సరే మీకుఁజెప్పువాడ నీరే ♦ స్వప్నమిట్లుఁ గంటి
ధరన్ దీని భావముఁదెల్పెడు థా ♦ తలెవ్వరనుకొంటి॥

తో॥ అకెట్టికలయోనాకుదానిసా ♦ వధానముగఁదెల్పుమదీయ
బుద్ధికిఁ దోచనిచోదై ♦ వ దోషమని నిల్పు ॥

వ. అందుకు పానదాయకుడు, ఆర్యా! రాత్రికలఁగంటి నందు నొక ద్రాక్షవల్లి మూడు కొమ్మలగలదై పుష్పించి, ఫల గుచ్ఛంబులతో నురుట్లూగినట్లుండుటయు నట్టిపండ్లగుత్తులం గొన్నిటిఁగోసి రసంబుఁడించి గిన్నెలతో మారాజుగారికి యిచ్చినట్లుఁ గంటిననగా

హిం. తో—జుల్వా.

పానదాయక! దానికిభావమియదే-నానుడివిధమునతొలినా టి-నౌకరి దయసేయఁబడును. ॥పాన॥

1 కలలవిధమున నీకుగలుగు ఫలమధికముగఁ - దలపుననిడు కొసనను-భూతలపతికిటులను మిదియును ॥పా॥

2 ధరణిఁబుట్టగఁజేసిన యాదైవమునకు మొదటిఋణము దరువాతఁబెంచిన తలిదండ్రుల రెండవఋణము

నొరులుమనకుఁ జేసినయుపకృతులు మూడవఋణము యిం దరసి యొరులఋణము దీర్పదప్పదనిమదిఁదలపోయుము ॥పాన॥

వ. అనగా మొదటి రెండు ఋణంబులు ప్రపంచములో నెట్టి సత్పురుషుండైన దీర్చుకొన జాలడందు మూడవఋణముం దీర్చుకోగల. డెట్లన దానెవరికి సహాయమొనర్చునో, అట్టి వాడు కృతజ్ఞతాపూర్వకంబుగా మరొక్కడు దన్నుంజేరిన మొదటివానింబోలి సహాయ మొనర్చినచో, మొదటివాని ఋణము రెండవవాని వలన దీరనగునుగానపానదాయక, నేను నీకు సహాయ మొనర్చితి నిదియొక ఋణంబె, యీఋణం బెట్లు దీర్చుకొందువు? నావాక్యములుగా రాజుగారితో

సీ. వెలకునిస్మామేలి ♦ యుల కమ్మబడిపోతి

పరునకు నేసమ్మ ♦ బడితినను ము
ఆతనిభార్య మో ♦ హంబునన్ బట్ట "ఛీ"
సీతికాదన ఖైదు ♦ నైతినను ము
న్యాయంబుచే బెట్టి ♦ నా కొట్టినా! నాను
ప్రాణమాయనచేతి ♦ పాలిదను ము
చెరబాపినన్ను ర ♦ క్షింపదా నెలకొన్న
గలకాలమయ్యెద ♦ నిలుచునను ము

గీ॥ దిక్కు-లేనట్టి నేబర ♦ దేశినను ము
లేశమైనను నేరంబు ♦ లేదటను ము
అట్టివానికిఁ జెరయు న ♦ న్యాయమను ము
ముత్తమున ఖైదువిడిపించు ♦ టుత్తమను ము.

వ. ఎట్లయిన యీమాటలు రాజుగారితో చెప్పి నాకుం జెర దప్పింప నీభారమని, భక్ష్యకారునివైపు దేరిచూచి నీకల లేమిటి యని యడిగె నందు కతండు—

తే. కలను తెల్లని పిండివం ♦ టలుగలట్టి
మూఁడుగంపలు శిరముపై ♦ మోపియుంట
నందు పైగంపలోన తా ♦ జార్హమైన
వంటలన్నియు దినుచుండె ♦ బక్షులన్ని.

వ. అందులకు యోసేపు

తోడి—జుల్వ.

భక్ష్యకారుడ దానికి - భావమియదే - నీకుక్షమాపణము
లేదు - ఘోర మరణమొందెదు ॥భ॥

1 గగనపక్షివితతి - నీకాయమును దినఁజూచితి - మూఁడు

గలవు రోజులటుపై - డొల్లునీ శిరము జగతి ॥భక్ష॥
యిట్లుఁ జెప్పిన వాడు నేలంబడి

జంఝూటి—ఆట

అనఘా! యియ్యది నిజ - మౌనా? వచింపుము - కనికర
మెదనిల్పుము॥

1. బాల్యంబునుండి సుఖభాగి - నైనట్టి నా - పాలి యదృష్ట
మిదే? ॥అ॥

2. కాంతిని బొల్చు నీ - కాయంబు బెంచుట - ఖగములార
గించనే ॥అ॥

3. సఖుడ! నీకుమేలు - చావదియు నాపాలు - జరుగఁ
గంటిమె? కలలు ॥అ॥

వ. ఇట్లు పానదాయకునకును పునరుద్యోగము, భక్ష్యకారుని ఖండించుటయు యోసేపు చెప్పినట్లు మూడురోజులకు జరిగెను.

ప్రథమభాగము—సంపూర్ణము.







# యోసేపు చరిత్ర.

## హరికథారూపము

### ద్వితీయ భాగము.



ఇట్లు యోసేపు కారాగృహంబులో నుండ నంత ఫరోసార్వ
భౌముండు స్వప్నంబుగని దాని విశదము నిమిత్తము సకల
జ్యోతిశ్శాస్త్రజ్ఞులను, మహా విద్వాంసుల బిలపించి

బ్యాండు స్వరము.

వరపండితులార! వందనములు బొలుపార - కరుణనాపైఁ
జూపుకాల మిదారా.। వ॥

1 గడచినరాత్రిని రెండు - కలలుగంటిని వినుండు - యొడబడి
వానిలోనే - ముందునో గనుగొండు॥ వ॥

2 భావములు దెలిపిన - బహుమానము కొదువౌన? - నా
విన్నపమాలించి - నన్ దోసమౌన?॥ వ॥

వ ఇట్లు విన్నవించిన యెవరును రాజుగారి స్వప్నంబులకు భా
వంబు జెప్పంజాలరైరి. అప్పుడు యోసేపును పానదాయ
కుండు జ్ఞప్తికిదెచ్చుకొని రాజుగారితో—

సీ. అలనాడు మేము ఖై ♦ దులోనున్న మాతోడ
ఖిన్నుఁడై యిబ్రీయు ♦ డున్నవాడు
పాపమింతైన సం ♦ భావింపకుండిన
జెరనుంటినంచు దాఁ ♦ జెప్పినాడు

ఖైదులోపల మేముఁ ♦ గన్న స్వప్నంబుల
కున్నదున్నట్లుఁ దా ♦ నన్నవాడు
నుడివినరీతి ని ♦ క్కడ శిక్షలనుగూర్చి
పడయఁబోయెదరంచు ♦ బలికినాడు
తే॥ అతఁడుఁ దప్పక మీకల ♦ లరయువాడు
నేనుజూడఁగ భూమిపై ♦ లేనివాడు
కలల భావంబు విడఁదీసి ♦ తెలుపువాడు
తమరుఁ బిలిపించితే తప్ప ♦ తరలిరాడు.

వ. అనిన చెరసాలలోనున్న యోసేపునకు రాజాజ్ఞ దెలిపిన యోసేపు పెంజీకటి సూర్యుండు డాగి ప్రాతఃకాలంబున నెర్రని ముద్దవలె ప్రయాణముసేయ నేతెంచునట్లు భాసురాంగుండై రాజు సన్నిధిని నిలువంబడ నా స్వప్నంబున కర్థంబు గూర్తువా? యన యోసేపు దైనాధీనము ఆయిన నాకలలెవ్వియని యడిగిన ఫరో:—

తో. ఏటియొడ్డున నిలువంబడి నా ♦ యెదుటఁ జూచుచుంటి
నీటుఁగలిగి బలిసిన యేడావుల ♦ నిలుచుండుటఁ గంటీ
దదంతరము జిక్కియు వికారముల ♦ సప్తగోవులనుగంటి
మదంబుఁగల సప్తగోవులను నె ♦ మ్మనమున దినగంటి

వ. రెండవకల యేదన,

తో. ఎన్ను లేడు మంచి వొక్కదంటున ♦ కేర్పడ గనుగొంటి
గ్రన్నల పీలవేడు నందునను ♦ గలిగినట్లు గంటి
మోలరెండు రీతులైన యెన్నులు ♦ మొలచినట్లు గంటి
పీలవెన్నులేడు మంచివాటిని ♦ బిరానదిగనంటి.

వ. రాజు చెప్పిన కలలకు వివరణ

సీ॥ తొలుత మీనిద్రయం ♦ దున గన్న కలభావ
మాలేడు సంతుష్ట హాయనములు
వెనుక శుష్కించి క్రిమిం ♦ గిన గోవులేడును
వరుసగాఁ గర్వ్య సం ♦ వత్సరములు
గలలొక్కటాను నె ♦ న్నుల యూవులనుగూర్చి,
తృప్తిగాఁ బండు నై ♦ గుప్తునందు
సప్తసంవత్సరా ♦ ల్లనుదెంచుచున్నవి
వెనుక కర్వే డేండ్లు ♦ జనునిజంబు

తే. పండు నేడేండ్లుఁ బూర్ణమా ♦ పంటలోన
గరవునకు ధాన్యమునుగూర్పఁ ♦ గలిగినట్టి
యధిపు నియమించి యటుసేయు ♦ విధములరసి
స్వప్న సాదృశ్యములను దై ♦ వంబు దెలిపె.

వ. అని కలలభావంబు బోధన జేసినమీద రాజు సంతసించి

సురట—ఆది.

సుగుణోపేత! నిన్ను మెచ్చితి-సుందరగాత్ర-జగమున నిను బోలినట్టి-జనుడు లేడనిచూచితిఁ - దగువాడ నీవెనామ సమస్కృతి ॥సు॥

1. శాసనాదు రాజ్యభార-ఘనత నీవశమానురా-నేనునీవేచు నీవేనేనురా ॥సు॥

2. వందిన జనబృందమ్ము-వశేమువరలును సదా-గృహామందు నీవె వందనీయుడవు ॥సు॥

3. ఉంగరంబునుంగొనుము - యుజ్వలాకార! వినుమా-యర

యంగనంత - టధికారి వీవె ॥సు॥

వ. యిట్లు భూషించినవాడై ఫరో తన రాజ్యమునకు యువరా
జును జేసియుండునంత కలలరీతిని, సంపూర్ణముగ సస్యములు
బండ మొదలుబెట్టెను. యోసేపు తద్రాజ్యమందు గల
సర్వప్రదేశములు వెమకుచు, గొట్లు కట్టించి ధాన్యంబును
గూర్చి ప్రజల సంరక్షించుచు, రాబోవు కరవునుగూర్చి యా
లోచించుచుండు నంత నిక్కడ కానానులో తనస్వకుటుంబము
క్షామమున పీడితులైయున్న కుమారులను దండ్రి యాకోబు
బిలిచి.

కళ్యాణి—ఆది

తగునా! సుతులారా! మీరిం - తవిచారమొందుట ॥త॥
మొగముమొగముజూచుకొనక -ముందుబ్రతుకజూడరే ॥త

1 వింటినైగుప్తునంట -పంటవిశేషమంట- వెంటనేగికొంటిరామ
న - యింటికిలేదీతంట ॥త॥

2 పూని పదిమందిమీరు-బోయిరాగానున్నారు- బినమీతో
బెన్యామీను - నంపనా మనసు వేరు ॥త॥

వ. అని కుమారులకుం జెప్పి బెన్యామీనుదనదగ్గర నుంచు
కొని తక్కిన పదుగుర బ్రయాణముజేసి ధాన్యముంగొన
నైగుప్తుకంపెనట, వారువచ్చి యువరాజుమ్రోల నిలువం
బడి సోదరులని గుర్తించి సంతోషిత స్వాంతుండై పైకి
దోప పరుష వాక్యంబుల నిట్లు సంభాషించె

హిం. ముఖారి—జుల్వ

యో॥ ఎవ్వరురా! మీరలిం - దేలవచ్చినారు - యివ్వసుధనే

వూరు - యే - యేనంశపువారు ॥ఎ॥

1 సో॥ కడనుమాస్థలము - కానానుదేశము - కడుపున కన్న
ము - లేకను వచ్చినాము ।మేము॥

2 యో॥ మాదేశముజూడ - మ - ర్మముగ మీరుఁజూడఁ
గాదె? వచ్చితిరీడ - పలుకంగనమ్మతిగూడ ॥ఎ।

3 సో॥ యొక్కనినికికొడుకులము - మేమిక్కడబలుకుటనిజము
తక్కుమాటలేమనము - యిది - తప్పిన నీదాసులము॥ఎ।

వ. అందుకు యోసేపు మీరెందరో నిజము జెప్పుమనిన

కం॥ పన్నిద్దర మొంకొక జన
కున్నెజీజనియించ, జన్న ♦ కొమరుఁడు గృహమును
దున్నాడు యొక్కరుఁడు లే
కున్నాడు యదార్థమిది ♦ యుర్వీనాథా.

వ. అట్లయిన మీతండ్రియొద్దనున్న వానినింగొని వచ్చి, నాక
గపరచునంతకున్ను మీసత్యము తేలునంతకును

మ త్త కో కి ల

నేను దైవబల బుగల్గిమ ♦ హింజరించుటచేత మీ
పైని నాకు కృపారసంబుయు ♦ పార్జితంబగుఁగాక, మీ
లోనొకండు బలుండు నచ్చెర ♦ లోనసుంచి తలిమ్మవా
రూనిధాన్యముఁగొంచు పోవుడు ♦ యూరుఁజేరరయంబునన్

వ. అనియువరాజుగానున్న యోసేపు వారిలో షిమ్యోనను
వానిని ఖయిదులో వేయదలంచినపుడు, వెనుక వారు
జేసికొన్న స్వయంకృతాపరాధమని చింతించుచున్న వారి
తో రూబేను.

హిం. తో. ఆది

సోదరులారా! ఫలంబును - జూచితిరా - చూచితిరా-
మును దాచిన పాపము - సూచనమైమదిదోచెఁడు ॥చూ॥

1. తమ్ముని యేఁడుపు - తగులక పోవునె - యిమ్మహిలో
దాని ఫలము ॥సోదరు॥

2. అయ్యో! యనుచుండ - నమ్మినదానికి - నియ్యెడఁగల్గు
ఫలము ॥సోదరు॥

3. బాలుఁడు చేతులు - బట్టియునేడ్వఁగఁ - జాలినొందని
ఫలము ॥సోదరు॥

వ. వారిట్లాలోచించుకొనుట మోసేపుగ్రహించి

తే. మొదట నన్నిట్లు పరుల క • మ్మటయదేల?
పిదపననుగూర్చి యిటు విల ♦ పించుటేల?
జెలఁగిచేసిన వారికిఁ ♦ జేసినంత
యనుభవింపక తీర దెం ♦ దైననిజము.

వ. అని యోసేపు బైటికి వెళ్లి శోకించినవాడై తిరిగివచ్చి షి
మ్యోనుని బంధిఖానాలో వేయించి యొక భటునిచే గోనె
లకు ధాన్యముగూర్పించి వారివారి గోనెలలో వారివారి
సొమ్ము పెట్టికొంతమేర సాగనంతమని యానతింప నట్లే
చేసెను. వారు ప్రయాణమైకొంత దవ్వరిగి గార్దభము
లకు మేతకై చూచునెడ గోనెలలోఁ బైకముండుట
జూచుకొని.

బ్యాండు స్వరము—ఏకతాళము.

అరెరె! యెవ్వరు యీ కార్యముఁ జేసియుండిరో॥ యాశ్చర్య
ముగనున్న దరసి గోనెలజూడ॥ ధరణిపలభునకు - ధాన్య

మున కిడినక్రియ ధన మొప్పటివలె - తరుగకున్న దీన ॥అ॥
1. క్షితిపతి యిటులఁజేసెనే? తన సేవక - వితతి కానించనే?
లేక పరమభక్త - సుతిని యద్భుతకృత్యమునుగనేమొ తెలి
యదు వెతలుఁబెట్టకపోన - డిబివిన్న నారాజు ॥అ॥
వ. అట్లు భయభ్రాంతులయి యూరుజేరి తండ్రితో
కల్యాణి। ఆది ఐగుప్తు పురివర్ణన.
ఆపురము వైభవంబెన్న మహిలోన నేరికయిన దరముటయ్యా
కాపురంబులుండు మేడలును కొంత - సేపుండి చూచినను
జాలయ్యా ॥అ॥
1. చుట్టు - పూలతోటలతోగన్నట్టు - వరిచేలెన్న మేరపె
ట్టు - సడజాలనట్టి నీళ్ళగట్లు - వేలపుట్లతో గలకొట్లు-
శాలలన్ని లెక్కించనన్ని చెప్ప - జాలనన్ని గజవాజు
లయ్యా ॥ఆపురము॥
2. రేడు - వీటికిని దగినట్టివాడు - నెంచు - సాటిలేనట్టి
వాడు సొగసు పాటిగుణాంబులవాడు యీ - నాటికిర్వ
దేండ్ల యీడు - బాటనేగువార్కైన ధాన్యంబు - లోటు
సేయకను గొల్చునయ్యా ॥అపురము॥
వ. మా సవి స్తరము లడుగగ నున్నంతజెప్పినను మిమ్మను
నమ్మంజాల తండ్రివొద్ద నున్నవానిని గొనితెచ్చి నాకు
జూపునంతకు నితని ఖైదునుంచుమనని జెప్పి షిమ్యోనుని
బంధించె నితనిని గొంపోయి మారాజునకు జూపిననేగాని
లేనిచో షిమ్యోనురాజు మరియు నిట్టి సందర్భమేగాక
మేము ధాన్యముకిచ్చినసొమ్ము మా మా గోనెల నెవ్వరో

దాచి రంపు కైనరి దుర్గ్రహించుచున యాకోబు విని

సీ। అల్లారుముద్దుగా ♦ నాడి పాడుచునున్న
యోసేపుమరణించు ♦ టొక్కచింత
కాని దేశానికిం ♦ కరులచేజిక్కె సి.
మ్యోను ఖైదులోనుండు ♦ టొక్కచింత
యారాజుమ్రోల బె ♦ న్యామిను గొంపోవ
వలెనంచుఁ బల్కె మి ♦ క్కిలిగచింత
చెలఁగిచెర్లాఁడు పు ♦ త్రులు ముగ్గురుసునాను
కండ్ల ముందర లేని ♦ కతనచింత

తే। సూనులైమీరుఁ గప్పఁగా ♦ ల్పుటయుచింత
నాకు ప్రతికూలముగ మీరు ♦ నడువచింత
చింతలుడిపెడుకర్త యో ♦ సేపుచెంత
నన్ను జేర్పక యుంచెఁ బ్రా ♦ ణంబుఁగొంత

వ. ఇట్టిచింతను గొన్నాళ్లు గడపినతోడ తెచ్చుకొన్న ధాన్య
మయిపోయినమీద తండ్రి కుమారుల బిలిచి

దేహాగ్—ఏకతా.

కుమారులార! ధీరులార! కోరెదీనిగనుడు - ప్రమోద
యుతులరై మనసు - పరగవినుడు పరికించి మనుఁడు ॥కు॥

1 అటనుండి తెచ్చినధాన్యం బయిపోయెన్ - కటా కరువు
తోడఁజచ్చు-కాలమిదాయెన్ - దిటమునిగులాయెన్ ॥కు॥

2 పదండి పైకమటకుం ని-బ్బడిగొంపొండు - మొదల్ మసి•
పతికివ్వగలది-ముందుగ నిండు - ముదంబున రండు ॥కు॥

వ. అనియు మరల నిట్లయె. యీ బెన్యామీనుని మాత్రము

మీవెంటఁ బంపుటకు నామది యొప్పకున్నది గాని మీరే ధాన్యంబునుగొని తెండన గూబే. సంమలకు

ఆరభి—ఆదితా

అయ్యా! యింత చింతతగునా యిర్యోడలను బెన్యామీ నంపక - యేమి లాభమటఁగల్గబోనో? చెపు - మయ్యా

1 సుతులున్నారుగాదె నాకు-యిరువురుఁగూడా - నితనితోడఁ బోయి మళ్ళితని గొనిరా - నితకి నాదుసుతునొకని జం పుకొ - మ్మయ్యా.

2 నాదుచేతి కప్పగించుమ-బెన్యామీనుని-యీదినంబు మొద లెందునైన పై - మీదనీగవైన వ్రాలనివ్వ - నయ్యా -

వ. యటకేలకు బెన్యామీనుని బంపుచు

తే. ఆయెహోవాకృపామతి ♦ నరయుసేని
రాజసముఖానగాదు క్రూ ♦ రపు మృగాల
మెలఁగినను బెన్నిపిమ్మ్మయో ♦ నులకు మహిని
రాలఁబోడేచిన జావేమి ♦ రాదుపొందు

తే. గడుపు కాలింతకైనీరు ♦ విడుతుననుడు
యతని కితనికిదానె ది ♦ క్కంటెననుడు
పరుల బిడ్డలసాధింప ♦ బాపమనుడు
ఏది యెటులైన తనదే ప్ర ♦ సాద మనుడు.

వ. రాజుగారితో తనమాటలుగా నిట్లు నుడువుడనిదీవించిపబ్బి చ్చి ప్రయాణము జేసి పంపెనట వార లేతెంచి రాజు గారి సన్నిధిని నిలువంబడి యున్నవారలం జూచి తన సేన కునితో

తో॥ సేవకుండ వీరిని వెంబడించి ♦ చేప్పుము, మనయింట
వేవేగము చేయించుము, రుచిగ ♦ వేటగోసివంటఁ
గలసి వీరితోడ నారగింపం ♦ గలిగెమనసు నాను
యలకుపుష్పదనియును నీనాల ♦ స్యంబుఁ జేయుబోకు.

వ. యిట్లు జెప్పిన సేవకుండు రయంబున భోజనముసిద్ధము చే
యింప వీరిని వెంటగొని బోవుచుండ, నాటిసొమ్మునిమి
త్తమేమెరాయిట్లుమనలను గొనిపోవుచున్నాడని సేవకునితో

కం. మునుమే మొసఁగినపైకం
బును మాగోనెల నెవాహో ♦ మోసముచే జా
చిన వారలు మరలవి తె
చ్చినవారము ముద్రమునుపు ♦ చేకొనుడియదే.

వ. అని సేవకునితో నన్న భయ పడకు, దని దైవము మీను
సమకూర్చెననియె నింతలో యోసేపు తమదగ్గరకు రాగా
వారు తెచ్చిన కానుకలు సమర్పించి రప్పు డిట్లనియె.

పార్శిమట్టు—జుల్వా

యాతనోపేతులారా! - యవధరింపుడు-
మీతండ్రి కుశలమున - మెలఁగుచున్నాడా?
గతాగతంబులను - గమనించుచున్నాడా?
వితాకు మదిని లేకను - జీవించుచున్నాడా?
కుతుహాలంబుమది-కూడియున్నాడా? చెప్పుడునాతో-॥యా॥

1 నిహూపణముగ మాకటక - నిష్టురము గలదంటిరే
కరారుమీద వాని నా - కడకు దెత్తుమంటిరే
కరారుఁదప్పిన మము - గాదనుకొండంటిరే

సరే యీతండతడేనా! సత్యమె! చెప్పుడునాతో ॥యా॥

వ. అడిగెడు ప్రశ్నంబులకు నుత్తరంబులిచ్చుచు నమస్కరించి బెన్యామీనుం జూపిరి. యోసేపు తన స్వాంతమున్నని మీదగల శోకముఁ బట్టజాలక మేడనొక భాగంబునకుం గొనిపోయి ప్రలాపించియేడ్చెను. తదనంతరము పెద్దవాడు మొదలు చిన్నవానివరకు వరుసలుదీరి విందారగించిరి. యోసేపు తన సేవకునితో

తే. గోనెలకునిండ ధాన్యంబు ♦ గూర్చి యెవరి
పైకమును వారి గోనెలన్ ♦ బదిలపరచి
యందు కొండిక వాని భా ♦ న్యంబునందు
వెండిగిన్నెయ నుంచుమో ♦ భృత్యవర్య.

వ. అని జెప్ప నతండట్లొనర్చి ప్రయాణమున గొంతమేర సాగ నంపె నంతట వేకువను సేవకునితో వెండిపళ్లెరమున్న వానిని గనుగొని, తీసుకొనిరమ్మని చెప్పిన రయంబున బరుగు లిడుచు వారలం గలసి

కీర్తన

బలె! పెద్దమనుజులే! నిల్వుడు పారిపోకుడు - భూ -
తలమున మిమ్ముబోలు-తక్కులనగన వినజాలము-॥బలె॥

1 యెక్కడ వారలో మిమ్ము - నిలుఁజేర్చుట మొదటితప్పు
ప్రక్కలెగయున ట్లన్నము - వడ్డన రెండవతప్పు
మిక్కిలి కటువనధాన్యము - మీకిడ మూడవతప్పు మీ
చక్కమే మెరుఁగక నిచ్చుట - చనువిచ్చుటె మాదెతప్పు
పో - పెద్ద -

2 మారాజుపళ్లెరము - మాయగాఁగొనిపోవడము—యీతీ

రు మీాకేగాని మరె - వ్వారికిఁదగదంటినిపో - పెద -

వ. అని సేవకుండనిన రిచ్చపడి చూచుచున్న వారి గోనెలం బరీక్షించుచు బెన్యామీాను గోనెలో దాని గనుంగొని యతని దీసుకొని వచ్చుచుండ నందరుకూడ రాజుసన్నిధి కేతెంచి నిలువంబడియున్న వారితో మీారీపనిచేయుట తగునా? యని యోసేపనిన యంతులకువారు

సీ. ఏలినవారు మీా ♦ రెందరోచెపుడన్న
చిన్నతమ్మునివార్త ♦ జెప్పినాము
చెప్పినమీాదఁ జె ♦ చ్చెరఁ దెమ్మనంగ మా
పితృనకు జెప్పి మె ♦ ప్పించినాము
మెప్పించి యనుజన ♦ మేతులమైవచ్చి
నీనుసన్నిధిని కా ♦ న్పించినాము
కాన్పించినను మాకు ♦ కడుపార భోజ్యంబుఁ
బెట్టించఁదినియు దృ ♦ ప్తి పడినాము

తే। కాని యీాతప్పుకై చిన్న ♦ వానినేము
విడిచిపోవుదమన గాళ్ళు ♦ దడబడియెడు
బోదమనుకొన్న నొకవేళ ♦ ముదుసలి కని
బాలుఁడేడన నేమి చె ♦ ప్పంగలాము?

కావున.

భ్యాండుస్వరము—జల్వ

బాలకు నిటఁబాసెయుఁ బో - వగజాలమయా - పాలకా
నీకు బదివేల దండములయా - తాలిమికలదా యీాదా
సులమీాద - లేదా-జనకునిజంపుకొన్న వారమైతిమికాదా

మా ॥బాలకు।

1. కనిమొనిపుత్రిశనితలి - కానలోకని - తినిమెన్నృగంబల మటంగని - జనకుండుమదిని - వగచుచుండెను యాపిన దుండెను - గాన - కనికరముస నితనివిడువ - గను మనవి నొనరించెదకుమా ॥బాలకు।

వ. యిట్లు యూదా బెన్యామీనుని విడువ బ్రార్థించుచు

తే. ఇంలియోం గాక యిటకు మే ♦ మేగునప్పు
కంటం దడిబెట్టిపను నల్ల ♦ కాడుం గల్ప
కుండు లేనియు ని వ్వాని ♦ నెందు విడక
గొనిరదుంబున జనుబెంచు ♦ డని మదీయు
జనకుం డడిగెండు దానికి ♦ సాక్ష్య మేది?

వ. అనియిట్లు దీనాలాపము లాడుచున్న సహోదరులం జూచి యోసేపు

కం. మనమున జను యా దుఃఖపు
వననిధి కెన్నాళ్ళు గట్లు ♦ నైవగలా సం
చును బరుల వెలికిం బంపియు
దన శోకము వెల్లడింపం ♦ దగ నిట్లనియెన్.

బేహాగ్ —ఏకతా।

కనుడిదె నాదైన సోయ. గను పటవి ససూయను-గినుక బరుల కమ్మినస యీ - గితము మరచిపోతిరే ॥కను॥

1. ఎవ్వరంచు సన్ను విచార - లెంచుచుంటిరోంగదా! చెప్పిన విచారమ్మునిన యో - సేపుండను నేగదా! కను।

2. పట్టిగోయి వేయునపుడు బ్రతిమిలాడితిని గదా! - చుట్టుల

విన కమ్మిన యన్నలు మీరే గదా! ॥కను॥

3. పరమపురినివాసుని - కని - కరము వల్లనేగదా - ధరను నేలు రాజునై తుదకు మిముఁ జూచితిఁగదా ॥కను॥

వ. యింతులకయి మీరుఁగుందఁ నేల, యీశ్వరుండే నన్నిక్క-డికిఁ గొంచువచ్చె,

ఉ. నన్నఁటఁ గండ్లమంటవల ♦ నన్ దెగనమ్మితి రిప్పుడిచ్చోఁర మ్మన్నదికడ్పుమంట కద ♦ యగ్రజులార! భయంబదేల? నేఁ నున్నదిజేనియింటనిపు ♦ డుందునెలేమి? యొకింతమైన, మీ కన్నిఁటఁబండెఁబంటపర ♦ మాత్ముకృపాతిశయంబు కల్గగన్ మరియు

సురటు—ఆదితాళము.

సహోదరులారా! మీరు వి - చారమొందగ నేలను మహాక్షామ మందహారములేక - సహాయముగ ని - ట్టి హాయిపదవిని - మెహెూవయే ని - ర్వహించె మీరిద-గ్రహించి దుఃఖము మానరే ॥స॥

1, మకీ కరవుమీ - దరానుగల ద - ద్దిరాకమును న-న్ను రోసితిరి యాపరాత్పరుం డి - ట్టిరాజ్యమున మి - మ్ము రాజిలఁగ దీవింపడే ॥స॥

వ. ఇట్టి క్షామమున మీకాదరణగనే నిక్కడ నిల్వకున్నచో మీకగు దిక్కెదియోకదా యనుచు

సీ తనయుఁడు మోసేపు ♦ దైవకరుణచేత

నైగుప్తున కధిపు ♦ డయ్యెననుడు

యింతకంటెను కర ♦ వెక్కువై మి మ్మేలు

సది రాకమున్నె ర ♦ మ్మంటి ననుడు
గోపేను దేశంబు ♦ కొడుకులకును గొడు
కుల కౌ నటంచును ♦ బలికె ననుడు
కరవుకాలము మిమ్ముఁ ♦ గావ నా దగ్గఱ
నుంటచే దనకు మే ♦ లంటి ననుడు
తే. పసుల కీదేశ మెక్కుడు ♦ బలము యనుడు
బీదతన మిందు, గల్గక ♦ బెంచు ననుడు
రమ్మనుడు వేయి నేటికి ♦ రా గలిగిన
దాను జూడడె? యివియు స ♦ త్యమని మదిని.

వ. తండ్రితో నిట్లనమని సొంత తమ్ముఁడైన బెన్యామీను పైబడి

తో. తమ్ముడ నిన్నెన్నాళ్లకుఁజూచెదు ♦ తరుణమబ్బెనాకున్
నెమ్మనమున సంతసం బిమ్మహిని ♦ నిశ్చయముగఁజిక్కెన్
మూడుకాళ్ళముదుసలితండ్రియు నిను ♦ ముందరజూచినను
యేడి నీయగ్రజుండని దలచి ♦ యేడ్పించునె? నిన్నున్.

వ. అనుచుఁ గౌగలించుకొని ముద్దిడుచున్న యోసేపునుం జూచి సోదరులు తాము మున్ను జేసిన యపకారములన్ని యు జ్ఞప్తికి తెచ్చుకొని

శా. నిన్నా కానలజిక్కులంబఱచియున్ ♦ నిన్నమ్ముకొన్నందున్
దిన్నామింతటి దుష్ఫలంబులిక సందేహంబులున్ వీడె, నో
యన్నా! మాయపరాధముల్ సయిచియ ♦ వ్యాజానురాగంబునన్
గన్నయ్యన్ మము నేలుకొమ్మిక; నమ ♦ స్కారంబు లేపారగన్

వ. అని పశ్చాత్తాపహృదయులై నమస్కరించినవారైరి. యిట్టి

కలకలధ్వని ఫరోసార్వభౌముఁడాలించి, వారు యోసేపునకు సోదరులని గ్రహించి యోసేపుతో

మ. అనఘా! నీసుభవత్సహోదరసమూహంబైన యోజించుటే లను మీతండ్రి సమసముంగలసి పిల్లల్ దల్లులంగూడి వే కొని రారంపనిపంపవేమి. తగుసీగుల్ బ్రోపులన్ గాకబం డ్లసుగన్నింటి సహాయమిచ్చియనిరాటంకంబటన్ జేరగన్

వ. అని చెప్పిన రాజాజ్ఞవడసి సోదరుల నిష్టమృష్టాన్నముల సంతుష్టులజేసి నవ్యభూషణాంబరములఁ దమతమకొలంది యొసంగి ఖరశకటారులతోఁ దగుహితబోధనంబొనర్చుచు గొంతమేర సాగనంపెనట వారు సత్వరప్రయాణ మొనర్చి యూరుజేరి తండ్రిఁగాంచి .

పార్శిమట్టు—జల్వ

అయ్యామావిన్నప - మాలించుమో మా । యయ్యా - నెయ్యనుఁగల నీకుమారుఁ - డయ్యో సేపనువాఁడే? య య్యో - గుప్తుకును రా - జైయున్నాడే ॥మాయ॥

1 అన్నలనిమమ్ముఁబిలిచి - నిన్నడిగినాడే? యామొన్నటి వలెఁగాక యిపు - డన్నిదెలిపినాడు ॥మాయయ్యా॥

2 క్షామమున నైదేండ్లుఁ జచ్చుటేలనన్నాడే - కామకతన కడకు నిన్ను గదలుమన్నాడో ॥మాయయ్య॥

వ. ఇట్లు సుతులుజెప్పిన యుదంతమపూర్వముగానున్నాడని తలంచి

శా. ఉన్నాడా సుతుడిప్పుఁ బ్రాణములతో , నుర్విన్ మరేమైన మిమ్మున్నాడా సకలైకభోగములతోఁ నైగుప్తుఁబాలింపఁజే

కొన్నాడా? మదభీష్టసంపదలు నా ♦ కుంగూర్పగాలేచి, ర
మ్మన్నాడా? నిజమా? వచింపుడనుమా ♦ నాస్పాదమయ్యెంగడున్

వ. అనిన కుమారులు

కం. నిజమాయని యడిగెద వే
ల! జమీ! నీ మ్రోలఁగడు వి ♦ లాసంబగు బం
డిజతల్ గార్ధభముల స
క్యజముగఁ బంపించెఁ జూపు ♦ కాన్రాదె? పితా

వ. అనినపు డాశ్చర్యదృష్టిని దేరిపారజూచి యోసేపుపంపిన
గార్ధభశకట సమూహంబు నీక్షించి.

కల్యాణి—ఆది తా.

ఇం తేచాలును - సుతుడిలను బ్రతికి యున్నవాడింతే॥
చింతిలఁగానేల యో - సేపుంజేరిగనుగొందుగాన-నింతే-
1 చావకముందు - తని జాడ, తెలిసెను - నేను - వేవేగమీ
బండ్ల - వెడలి నాసుతుజూచుకొందు - నింతే।

వ. మరియు

ఉ. వచ్చినవాడనీగతికి ♦ వాంఛలుఁదీరెఁ గనానులోన, బో
వచ్చును బండ్లనెక్కి వయి ♦ వాడుఁ గలాడుమరెందునైన
నాసచ్చరితుండు యోసేపువి♦చారణసేయకపోనే, మిమ్ము
నేఁజచ్చినదాకఁ బొక్కెడుఁ బ్ర♦సాదమునైన నోసంగకుండునే?

వ. అని తనయులకుంజెప్పి సమస్తము బ్రయాణమై దైవాశీ
ర్వాదముతో నర్పణముల జెల్లించుచుగోషేను సమీపించి
యూదాను జూచి.

తే. తనకునై మేన బ్రాణాలు ♦ దక్కె ననుము

మనకు దానిచ్చు భాగమెం ♦ దనియడుగుము
తానువచ్చిరె జూపుట ♦ ధర్మమనుము
సొంత వారిని యొకకంటఁ ♦ జూడమనుము.

కాఫీ—రూపకము.

నాపుత్ర సుజనహితనుతా! - శుభగాత్ర - సుచరితా!
పాత్రుఁడవు సంపదలకీ భూ ♦ పాల - కుఁడవుగనుక ‹ భా
గ్యుండ నేనిక ॥నాపు॥

1. ప్రాణముండగనె - జూచితిని నిను - భయముఁదీరెను -
మానెదను నాజీవనంబును - సూనవితతి విధము-జూడుము
నీసోదరులను ॥నాపు॥

2. మన్నెసేవక నున్నావుకదా-మమ్ము బ్రోవను సదా-కన్ను
ల కరవుఁదీరె నీ - కన్నగలదె ? దిక్కు - గావ వలదె?
భువుని ॥నాపు।
అనన తండ్రిమాటల కడ్డంబై యోసేపు

మ. అయిగుప్తే పొలమై, సబీజమును నే♦నై,సోదరుల్ విత్తువా
రయివిశ్వాసమెకంచమై, ప్రభువుకా♦పై,యుండుటంబట్టిపెం
పయితిన్ బక్వఫలద్రుమంబునయినే ♦ నయ్యా!భయంబేల? లెం
డి యిదే మీకగు భాగముం దినిమనం♦డీవేడుకొండీప్రభున్

వ. అని గోషేనుభాగముం దనస్వకీయుల ♦ కర్పించి యాయు
రారోగ్య సంపత్తిచే మైగుప్తుభద్రాసనం బెక్కి కంటికిరెప్ప
లట్లు ప్రజల గాచుచు రాజ్యపరిపాలన మొనరెను.

ఉత్పలమాల

ఈ సుచరిత్ర మెవ్వరు ప ♦ ఠించిన విన్నను సత్పవిత్రనా
భ్యాసముఁ బాపమంను విజ ♦యంబు బరాత్పరునందు భక్తివి
శ్వాసముఁ గీడులందుగల ♦ శాంతతమిట్టి నుబోధగాక పై
వాసము జేర్ప దే! మహిని ♦ బాయని భక్తిని నున్నవారికిన్

—♦ మంగళహారతి ♦—

బేహాగ్—ఏకతా.

వరభక్త జనసుతపావన - మంగళం
బరమునువిడి ధరకేగిన - ప్రభుడ మంగళం ॥పర।

1. కలుషహరణ మానవర - తుక మంగళం - యా
సిలువభారమున నోర్చిన - శ్రేను మంగళం ॥వర॥

2. తారసూచికాగ్రపరా - త్పర మంగళం - భువి
సూరిజనార్పణల సం - స్తుత మంగళం -

3. విరివిగ బెజవాడ సంఘ - ప్రియుఁడ మంగళం
కరుణమయా నీతిభా - స్కర మంగళం -

తనూభవుండగు మోషేకవిచే విరచింపంబడిన

గద్య.

ఇది శ్రీ యేసునాథస్వామి పదారవింద భజనారతుండును
బీర్నిడీవంశ సంభూతుండు నగు సుబ్బయాభిఖ్యు ద్వితీయ
తనూభవుండగు మోషే కవిచే విరచింపంబడిన
యోసేపు చరిత్రము సర్వము
సంపూర్ణము.



# The Andhra Village Gospel Book and Tract Depot,

## WYNCHIPET, BEZWADA.

Kistna Dist. ( South India. )

***The following books are available here.***

1. All kinds of Bibles in various bindings In (English and Vernacular)
2. Allkinds of Tracts In(English&Telugu only)
3. All kinds of Concordances In (English & Telugu only)
4. All kinds of Commentaries in (English & Telugu only)
5. All kinds of Bible Dictionaries in(English & Telugu only)
6. Art velvet wall Text Mottoes & Plain wall cards (of various kinds)
7. Bible coloured pictures of all varieties
8. Bible scripture calendars of all varieties with pictures of every year

## Telugu Publications.

## తెలుగు పుస్తకములు.

9 Helps to Bible study. by. Rev. P. Joseph
సత్యవేదపఠనమునకు సహాయములు ..రు 0—6—0

10 Help for the Tempted. by. Professor Amos R. Wells & translated. by. Mr. James M.Bha-ktul B. A., L. T. Retired Deputy Inspector of Schools, శోధించబడువారికి సహాయము రు 1—0—0

11 Religious Instructions for christians. by. Mr. James M. Bhaktul B.A., L.T., Retired Deputy Inspector of schools.
క్రైస్తవులకొరకుమతబోధ.
(భూతదయ, బహుజన్మవాదము) రు 0--6--0

12. The chronology of the Bible. by. Mr. James M. Bhaktul. B. A., L. T., Retired Deputy Inspector of schools.
బైబిలు చరిత్రకాల నిర్ణయము రు 0—6—0

13. The total Gospel Narrative from the four Gospel. by. Mr. James M. Bhaktul. B. A.,L. T., Retired Deputy Inspector of Schools.
నాలుగు సువార్తల మొత్తము రు 0—4—0

14. Augustine Saravakkulu. by. Mr James M. Bhaktul B. A., L. T., Retired Deputy Inspector of Schools,అగస్తీను సారవాక్కులు రు 0—2—6

15. Hand book for Indian Christian Workers. by. Rev. W. C. Arvine. & translated by .Rev.E. C Adams
ప్రభువగు యేసుక్రీస్తునుగూర్చిన సువార్త ప్రకటించువారికి సహాయార్థమగు పుస్తకము రు 0—12—0

16. A good message from God.by.Rev. E.C. Adams
భగవద్శుభలవార్త రు 0—1—0

17. A conversation on Baptism. by. Rev. E. C. Admas బాప్తిస్మము లేక (ముంచడము)ను గూర్చిన సంభాషణ రు 0—1—0

18. The Commentary of Pilgrims Progress. by. Mr. C. Jonah యాత్రికుని పరమపదవి రు 1—0—0
19. The Days of Navah.by.Rev.A. Sims Translated By. Gandham Sastry B.A., నోవాహు కాలము రు 0—6—0
20. How to pray. by. Rev Torrey Translated By. Gandham Sastry B.A., ప్రార్థనావిధము 1-0-0
21. The Truth aboutBaptism by Rev. I M. Haldeman D. D. Transted By Mr. D. Moses M A. బాప్తిస్మతత్వము (ముంచడము.) రు 0—6—0
22. Satyagraha Sadhuvu. by.Mr. K. J. G. Sundaram సత్యాగ్రహసాధువు రు 0 - 6—0
23. Epistle for the Andhras. by. Rev. T. Heelis ఆంధ్రులకువ్రాసిన పత్రిక రు 0 — 8—0
24. God's Brief Message. by. Rev. T. Heelis దేవుని సత్యవేదనుసరణ క్లుప్తబోధ రు 0—4—0
25. The Man Christ Jesus.by.Bishop J. E. Robinson D, D., L. L D. & Translated by Rev. J. Venkata Chalam క్రీస్తు యేసను నరుడు రు 0—12—0
26. ప్రభువైన యేసుక్రీస్తు శిలువమరణముద్వారా శరీరసంబంధమైన వ్యాధులు పరిహారమాయెనా? by Rev. I. M. Haldeman D. D. Rs 0—6—0
27. The Parable of the Prodigalson. in the style (Drama) by. Mr. N. D. Abel తప్పిపోయిన కుమారుని యుపమానమును గూర్చిన డ్రామా రు 0—4—0
28 History of Joseph. in the Style of Harikatha. By. Mr. Beerneedy Moses Kavi యోసేపుచరిత్ర హరికథారూపము రు 0—6—0

29 History of John. in the Style of Harikatha.
By. Mr. Beerneedy Moses Kavi
యోహాను చరిత్ర హరికథాలాపము రు 0—6—0

30 Basket of Flowers. in the style of Harikatha
By. Mr. Beerneedy Moses Kavi
పూలగంప హరికథాలాపము రు 0—4—0

31 Sacrifies of Isaac.
By. Mr. Beerneedy Moses Kavi
ఇస్సాకువధ రు 0—4—0

32 The Power of christian Religion. in the style of Drama By. Mr. Beerneedy Moses Kavi
క్రీస్తుమతప్రభా డ్రామా 0—8—0

33 The Hero's Victory. in the style of Drama
By. Mr. Beerneedy Moses Kavi
శూరవిజయము డ్రామా 0—6—0

N. B:— If you require any christian books that are not available in our book depot. we write to the places where they are available & supply them to you on receipt of your order.

మీరు కావలసిన క్రైస్తవ సంబంధమైన పుస్తకములు ఏవైనను మాకువ్రాసినచో మా పుస్తకశాలలో లేకపోయినను, అవి దొరకు స్థలములనుండి తెప్పించి సప్లయిచేయగలవారము.

*For Copies of above books & other particulars. please refer to—*

**D. B. JOSEPH,**
**Proprietor:- The A. V. G. Book & Tract Depot.**
***Wynchipet, BEZWADA.***
Kistna Dist. (South India)